శ్రీ కుసుమహరనాథాయనమః

# శ్రీ హరనాథుఁడు



ఉ॥ శ్రీహర నీదుపాదసర ♦ సీరుహ సేవ నొనర్చువారికిన్
మోహమదంబు దుర్విషయ ♦ ముల్ నశియించును ఘోర పాపసం
దోహము బాసిపోవు కను ♦ దోయికి సత్యమె కానుపించు సం
దేహము లెల్లదీరు విను ♦ తింపఁగ మోక్షసుఖంబు చేకురున్

ఉ॥ ముక్కున నాణిముత్తియపు ♦ ముంగర చూడ్కికి వేడ్క సేయఁగా
వక్షన రత్నహారమొక ♦ యందముగా ప్రభనొందుచుండఁగా
చక్కదనంపుచందురుని ♦ చందము తేజము పెంపొనర్పఁగా
మక్కువతోఁ జెలంగు మను ♦ మానిబకు వందన మాచరించెదన్

సీ॥ నీ చరితము గన నిగమ * గోచర! భవ
మోచనంబగు నిఖిల చ * రాచరముల
నిందునం డనఁగానేల? * నెందుఁజనిన
నంద నీ దివ్యతేజమిం * పొందుకతన —

శ్రీమతి నందివాడ శేషమ్మ గారిచే

రచియింపఁబడి, ప్రకటింపఁబడినది.

( మొదటి కూర్పు )

వి. ఎస్. ప్రెస్., కాకినాడ, 1933.

# ప్రేమ

శ్రీమెహెరనాథుఁడు ప్రేమపూర్ణుఁడు. ఆతని యవతారమే ప్రేమావతారము. ఆతని మతమే ప్రేమమతము. ఆతని జీవితమే ప్రేమ. ఆతని హృదయమే ప్రేమపూరితమగు పాత్ర. ఆతని బోధయే ప్రేమ. ఆతనికి విశ్వమంతయు ప్రేమమయమే. ఆయన నేత్రములనుండి ప్రసరించునవి ప్రేమకిరణములే. ఆతని నోటనుండి వెలువడిన ప్రతివాక్యమునందును ప్రేమనటి తాండవ మాడుచుండును. ఆతని మృదుమధురహాసమునఁ బ్రేమ భావము లుట్టిపడుచుండును. నాఁడు శ్రీకృష్ణుఁడై గోపికా రూపధారులగు మునులకుఁ గొంగు బంగారమై వెలఁగుట కీప్రేమయే కారణము. యుగ యుగంబునందును కాలరంగమున వన్నెచిన్నెల వెలంగు సృష్టి నాటకమునకు సూత్రధారి యైనది గూడ నీ ప్రేమను గాంక్షించియే. స్త్రీ రూపధారులైన మునిశ్రేష్ఠు లానందములో మునిగి యాతని బాహు పంజరమున బంధింపబడినదీ ప్రేమనువాంఛించియే. బాలకృష్ణ రూపమున వేణుగానము సేయుచుండ పశుసంతతులు కసవు మేయుట మాని యాతని పదముల మూర్కొనుచుండిన దీప్రేమామృతము నపేక్షించియే! భక్తిసంసిక్త చిత్తయైన రాధ దానెవ్వరో పరవశత్వమ్ము

# ప్రేమ

న నెరుంగక బృందావన ప్రాంతారణ్యముల నాతని మధుర గానము సేయుచు దిరిగినది ప్రేమఫలభ్రాంతి కతననే! తుదకు బాలకృష్ణరూపము సన్నిదిక్కుల నేకత్వము గలిగిన భ్రాంతిమూలమున గాంచుచు నటులనే యమునానదీ తరంగములపై నృత్యము నొనర్చుచున్నటులఁ దోప నాతని గౌగిలింపవలెననెడు కౌతూహలమున నందు దుమికినదీ ప్రేమ మూలముననేగదా! కావున నా రాధానగరనివాసులుఁ గూడ నాటి రాధికాంశసంభూతులని నిస్సంశయముగ చెప్పవచ్చును. ఈర్ష్యారహితమైన ప్రేమ, మధుర తేజో విరాజితంబగు ప్రేమ, మోహాంధకార నిమగ్నులకుఁ బ్రోవఁజూపు విద్యుద్దీపకళికవంటి ప్రేమ, వారి సొమ్మైయున్నది. కనుకనే వారలాతని నిర్యాణసమయము నెఱింగి యా ప్రేమాంతరంగుని వియోగభారము సహింపనోపక నలుబది యహోరాత్రములు నామస్మరణ మొనర్చుచు గొప్ప యజ్ఞముఁ గావించిరి. పిదప నాతఁడు వయోవృద్ధుఁడై యజ్ఞఫల మొసంగి దన జీవితకాలమును మరి రెండు వత్సరములవఱకును నా ప్రాంతముల గడుపవల నొసంగెను. ఆ సమయమునందే యా మహనీయుని దర్శనభాగ్యము మాకు లభించెను. కొన్ని కారణాంతరములచే లోకమాతయగు కుసుమకుమారీదేవి దర్శనభాగ్యమప్పుడు గలుగలేదని మేము చింతిలుచుండ "ఓ నా తల్లులారా! మాయిరువుర కెన్నడు వియోగము లేదు. నాలోనే యామె కలదు- నే నామెలోఁ గలను." అనియా ప్రేమమూర్తి నుడివెను. ఆ మధురవాక్యము

# ప్రేమ

బాతని నిర్యాణానంతరము మా కత్యంత ప్రియజననియగు కుసుమకుమారి ఋజువుచేయుచున్నది. ఆతఁడు భౌతిక శరీరమును వీడిన కొఱఁత తెంతమాత్రము గన్పట్టనీక, భక్తకల్పద్రుమమై, తల్లియు దండ్రియుఁగూడ దానయై మనుష్యుల సర్వదా కాపాడుచున్నది. ఆ ప్రేమరసప్రవాహినిలో గ్రుంకులిడుచు ప్రేమ మాత యొడియందు సుఖనిద్ర నొందుటయే మన పని—



# కృతిసమర్పణము

సకలకళావిభూషితులును, సంగీతవిద్యావిశారదులును, సద్గుణగరిష్ఠులును, మదీయహృదయకమలస్థితులును, నగు

## శ్రీ నందివాడ సుబ్రహ్మణ్యము పంతులు గారి

దివ్యచరణారవిందములకు, నీకృతి సమర్పించుచున్నాను.

ఇట్లు,

సుబ్రహ్మణ్య పాదసేవకురాలు,

నందివాడ శేషమ్మ.

జయ్

# శ్రీ కుసుమహరనాథ్

## —ధ్యానము—

శ్లో॥ నమశ్రీహరనాథాయ। శ్రీకృష్ణాభిన్నరూపిణే।
పదారపుత్రి భృత్యాయ। కృష్ణోన్ముఖకరాయచ॥

శ్లో॥ ప్రేమానందమయంసాక్షాత్। పూర్ణబ్రహ్మసనాతనమ్।
ఆత్మారామంగుణైర్యుక్తమ్। శ్యామలంశాంతవిగ్రహమ్॥

శ్లో॥ ప్రచ్ఛన్నం స్వజనాకీర్ణం। శుక్లాంబరధరంవిభుం।
కవివ్యాధి హరన్నామా। భక్తానామభయప్రదం॥

శ్లో॥ కుసుమ ప్రియయాయుక్తం। స్మితాస్యంస్నిగ్ధచక్షుషం।
రత్నసింహాసనాసీనం। హరనాథం భజామ్యహం॥

శ్లో॥ ధ్యాయేత్సత్య స్వరూపన్చ। రాధారమణరూపిణం।
హరనాథం దివ్యమూర్తిం। కుసుమ ప్రభయాయుతం॥

శ్లో॥ బృందావనస్యచ సదావితనోతికీర్తిమ్
యోనందయత్యఖిలభక్తజనాన్ స్వనేన॥
గోవింద వేణుకలగీత విముగ్ధభావాః
స్వరేభవంతి కుసుమేనయుతోవతాన్నః॥



శ్రీ హారనాథుఁడు.

—* జయ! శ్రీ కు సు మ హ రి నా థ *—

శా॥ శ్రీమందస్మితసుందరాస్యమున గా * రీ ముంగ్రులివ్వాంచుచు
స్వేహారుంబుఁదికొల్ప నీ తనువునం * దీ తెల్పు లీనంబగుఁ
స్వామీ! చూడుమటన్న సుస్మితమునే * వర్ణించుశంభుండుమ
మ్మోమున్ శశ్వదభీష్టసంపదలు నిత్యోల్లాసిమైకొల్పుచుఁ

శా॥ శ్రీరంజిల్ల లసద్గుణాభరణమై * సేవ్యానుకూలంబునై
సారాచారవివేకదంబయి మన * సన్నిష్ఠపరిభాషార్థ్యమై
ధారాళంబుగ వేదసారమగుచు * న్గళోకుందుబ్రిహ్మాంబవా
నీరాజత్కృపవేడుచుందుః వరద * శ్రీ కామితార్థప్రదా!

శా॥ కుందేందూపఃచంద్రికాబ్జదరదు * గ్ధోదన్వదంభోజస
త్కుందప్రస్ఫుటహారహీరఫణిస * త్కోటీరకీర్తిద్యుతిఁ
వందేహం రవికోటితేజసముసులం * వందేయటాదున్మదిఁ
సౌందర్యాధికు రామచంద్రు మమనంశాంబోధిచింతామణిఁ

చ॥ తనదు మనోబ్జమందు తగు ♦ ధాత్రృగతంబగు భక్తిపైకిజో
న్నినకిరియమంకెనపరిసవ ♦ విస్ఫురితినయ్యాజ వామభాగసీ
మనుదళుకొత్తు భారతి న ♦ మస్కృతులగ్నసివొందజేయుచుఁ
రణిత ఝుళంఝుళార్భటుల ♦ నవ్యపదాంబుజసీమనందియల్
ఘనముగమోరియులీల ఘనకావ్యచమత్కృతి గల్గజేయుచుం
దనివినొసంగుమీవని వి ♦ ధాతృసతిస్మదిలో భజింతునే

# శ్రీ కు సు మ హ ర నా థ్

అనిశము వామలూరు తన యత్వముగాంచగలేదు, రెల్లునం
దున జనియింపలేదు, అల ♦ దోసియబుట్టగలేదు కాళికన్
వినుతులొనర్పలేదు పుర ♦ శింపదొడంగితి బ్రోవుమమ్మనీ
తనయనటంచు కావ్యపర ♦ తత్త్వరసగ్రహణార్థసిద్ధికిన్

సీ॥ ధర సర్వమునకు నా * ధారుఁడవనినుందు
పూజింతురు నిన్మహా * పురుషులవని
సౌవర్ణమంత్రపు * ష్పములిచ్చి బాలురు
భజియింతురు నిన్ను కృ * పాళుఁడవని
రాగవిహీనులౌ * రాజయోగులుమది
స్తుతియింతురు నిన్భక్త * సులభుఁడవని
ఘనకావ్యరచనకై * కవికుమారులుసదా
వర్ణింతురు నినులోక * వంద్యుఁడవని
గీ॥ మంజుల శుభానుషంగ! దు * ర్మదవిభంగ!
మూషకతురంగ! హే జగ * న్మోహనాంగ!
యనుచు నుతియింతు నిష్టకా * మ్యంబులొసఁగ
పార్వతీపుత్ర! గజవక్త్ర! * భవలవిత్ర!.

గీ॥ సర్వమయుఁడయి వెల్గునీ * శ్వరునిమాడ్కి
ఆదిమధ్యాంతములు లేక * నలరి భువిని
వివిధరూపములను జూపి * వింతగొల్పు
నట్టి ప్రకృతికి నేను జో * హారొనర్తు!

## శ్రీ కు సు మ హ ర నా థ్

సీ॥ శ్రీకరంబయి మునిజన ♦ సేవితమయి
అద్వితీయాపరోక్ష స్వ ♦ యంప్రకాశ
మానమై సచ్చిదానంద ♦ మయమగు పర
మాత్మరూపంబునిల్పి హృ ♦ దబ్జమందు
ధ్యానమొనరించు విధము బో ♦ ధనము జేసి
సకలనిగమాగమాంత శా ♦ స్త్రములనుగల
సకలనిర్గుణతత్త్వార్థ ♦ సారములను
దెల్పి కృపతోడదీర్చి సం ♦ దేహములను
చిత్స్వరూప పరిజ్ఞాన ♦ సిద్ధినొసంగి
మేలొనర్చిన కరుణాల ♦ వాలు సుజన
పాలు సుగుణవిశాలు సు ♦ శీలు మాన్య
ధన్య శ్రీపతి వంశ సు ♦ ధాబ్ధిచంద్రు
పండితేంద్రు శ్రీమద్గురు ♦ భాస్కరార్యు
దలంతు నిశ్చలభక్తి స ♦ లలితకావ్య
విరచనాయత్తదృఢకాచిత్త ♦ వృత్తనగుచు॥

గీ॥ భక్తవత్సలు పరమకృ * పావిశాలు
మేరుసమధీరు సంగర * శూరు సాంబ
శివకుమారుకుమారు నా * శ్రితజనావ
నిను మదినివేడ్క మిర ని * నుతులొనర్తు!

## శ్రీ కు సు మ హా ర నా థ్

సీ॥ సదమలగుణరత్న ♦ సమితిని దనరారి
యమిత వైభవముల ♦ ననుభవించి
నిఖిలవిద్యాలయంబు ♦ నిధియని పేరొంది
నీతిమార్గంబున ♦ నెగడియుండి
విజ్ఞానవేత్తయై ♦ విమల యశంబొంది
సంగీతశాస్త్ర వి ♦ శారదుండయి
స్వాతంత్ర్యవృత్తికై ♦ సౌఖ్యంబు విడనాడి
పరదేశముల కేగి ♦ పాటుబడుచు

గీ॥ జీవయాత్రను గడిపిన ♦ శ్రీకరుండు
దామరాజువంశాబ్ధిసు ♦ ధాకరుండు
భువిని లక్ష్మీనృసింహాఖ్య ♦ బొల్చు పితకు
మోదములరగ సతము కే ♦ ల్మోడ్పులిడుదు॥

గీ॥ సత్యవాక్పరిపాలనా ♦ సక్తిఁ గలిగి
శక్తి కోలఁదిని సర్వదా ♦ ముక్తి కొఱకు
భక్తి నీశ్వరు ప్రేమాను ♦ రక్తిఁ గొలిచి
ఆత్మధర్మసంరక్షణ ♦ మాచరించి
సర్వలక్ష్మమ్మ యనుపేరు ♦ సార్థకముగ
దనరు సుజ్ఞాని నిర్మల ♦ త్యాగశీల
సకలశాస్త్రార్థవిజ్ఞాన ♦ సారమనెడు
పాలనను బెంచినట్టి కృ ♦ పాలవాల
అన్నవస్త్రాదులొసగి స ♦ మాదరమున
సంతతము బీదలను బ్రోచు ♦ సదయహృదయ
దైవసమమైనజననికి ♦ త్యంతప్రీతి
సర్వదా వందనములిడి ♦ సత్కరింతు.

## శ్రీ కు సు మ హా ర నా థ్

వివిధవిద్యావాప్తి ♦ వితతపవిత్రుడై
చరియించె నెవ్వఁడు ♦ సురుచిరముగ
వరతపోయజ్ఞము ♦ ల్వరుసతో నొనరించి
తరియించె నెవ్వఁడు ♦ దురితతతుల
అంతరంగమున బ్ర ♦ శాంతియుతుండయి
ధరియించె నెవ్వఁడు ♦ దారగుణము
నెలమి దీనుల కెల్ల ♦ కలితాన్నములనిడి
భరియించె నెవ్వఁడ ♦ పారకృపను

గీ॥ నవనిలోన సుబ్రహ్మణ్య ♦ డనఁగ బరగి
శౌర్యసారస్యకీర్తి చా ♦ తుర్యమహిమ
నద్వితీయుఁడటంచును ♦ నఖిలజనులు
పొల్పుమీరనుతింప బ్ర ♦ పూతచరితు
డై మనిన మామగారి నే ♦ నభినుతింతు॥

చ॥ అరయ బతివ్రతాతిలక ♦ మై తనరారిన భాగ్యరాశి సు
స్థిరతరకీర్తి శాలిని సు ♦ శీల యశోవిభవానురక్తిచే
పరమున భర్త గూడఁగ న ♦ పారముదంబున పుత్త్రమిత్త్రులన్
సరగునవీడి స్వర్గమును ♦ చయ్యన జేరి సుఖంబుగాంచి ని
ద్ధర విదుషీలలామలకు ♦ దారినిజూపిన ధన్యురాలు స
ద్వరమతి సూర్యకాంతమన ♦ వాసినిగాంచినయత్తగారికిం
బరమపవిత్రితస్ఫనుఁ ♦ భక్తిని వందన మాచరించెదన్

## శ్రీ కుసుమహరనాథ్

సీ॥ సకలభాషాకావ్య * సారోదకంబుచే
దాహశాంతినినొంది * దనరినట్టి
సంగీతవిద్యాప్ర * సంగమనెడు భక్తి
మారగించుచుఁ దృప్తి * నందినట్టి
అభినవ శ్రీనాథుఁ * డనఁగ శృంగారవై
భవమంది ధరయందు * వరలినట్టి
దానకర్ణుడటంచు * ధరణిజనులు గొని
యాడ ధర్మాసక్తి * నలరినట్టి
గీ॥ వాసిగా నందివాడ స * ద్వంశజలధి
పూర్ణచంద్రసన్నిభుని వి * బుధవినుతుని
ప్రాణనాథు సుబ్రహ్మణ్య * భవ్యచరితు
శ్రీపదంబుల కేనమ * స్కృతులొనర్తు॥

శ్రీ కుసుమహారనాథాయనమః

# శ్రీ హారనాథుఁడు

జయము! శ్రీ కుసుమాప్రియ * జయము జయము!
జయము ఫాగలహారనాథ! * జయము జయము!
జయము భక్తజనావన! * జయము జయము!
జయము గౌరాంగహార నీకు * జయము! జయము!

శ్రీ కుసుమహార! నీలీల * ప్రాకటముగ
పద్యముల వ్రాయనెంచుట * భ్రమయె నాదు
పలుకులందున నెట్టిలో * పంబులున్న
సవరణముజేసి కృతిగొను * సదమలాత్మ!

క్రీడి కుపదేశ మొనరించెఁ * గృష్ణుఁడెలమి
ధర్మసంస్థాపనార్థము * దారమతిని
ధరను యుగయుగంబులను ను * ద్భవమునొంది
జీవులను పావనాత్ముల * జేతుననుచు—

పూర్వమున బల్కినట్టి య ♦ పూర్వమౌ వి
భూషణము లనఁదగిన సు ♦ భాషణముల
ననుసరించి నవద్వీప ♦ మందుఁ నదియ
యనెడు గ్రామమునందు బ్రా ♦ హ్మణునియింట.

దుష్టశిక్షణమును భువి ♦ శిష్టరక్ష
ణము నొనర్పఁగ (శ్రీ) జగ ♦ న్నాథమూర్తి
కలియుగంబున సుజనాగ్ర ♦ గణ్యుఁడనఁగ
నవతరించెను ధీమహి ♦ మాన్వితుఁడయి.

జగదతీత విఖ్యాత య ♦ శము గడింప
నఖిలజనులకు నత్యంత ♦ హర్ష మొసఁగ
ఘనతమీఱ శచీదేవి ♦ గర్భమందు
జననమందెను భానుతే ♦ జంబుతోడ.

వెన్నెలనుమించు నగవులు ♦ చెన్నుగుల్క
చందురునిబోలు నెమ్మోము ♦ చందమలర
పరిమళాన్వితమైయొప్పు ♦ పసిఁడి పగిది
సహజ సౌందర్యనిధియయ్యె ♦ జగతినతఁడు.

అక్షరాభ్యాస మొనరించె ♦ నైదువత్స
రాల ప్రాయమునాఁడా గు ♦ ణాలబరణి
సకల విద్యలలోఁ గల ♦ సారమెల్ల
వినుసమాత్రాన గ్రహియించె ♦ నేర్పుమీఱ.

లలితమైనట్టి కృష్ణలీ ♦ లలను దలఁప
జేయుచుండిన యాతని ♦ చేష్టితముల
ప్రబలతరమగు నాశ్చర్య ♦ భరితహృదయు
లగుచు గాంతురు పురజను ♦ లనవరతము.

మాట లాడఁగ నేర్చిన ✽ నాటనుండి
హరిహరి! హరి! హరిహరి! ✽ హరి! యటంచు
తప్పటడుఁగులతోడ నృ ✽ త్యమును జేసి
తల్లిదండ్రుల నతము రం ✽ జిల్లఁ జేయు—

తోడి పరలతో నాట ✽ లాడుతఱిని
నర్ధచంద్రసహితు దన ✽ యాత్మఁగలఁచి
నిలచి యనిమిషత్వమునొంది ✽ పలుకకుండ
బాలు రాతనిగాంచి వి ✽ భ్రమమునొంద!

గురువునొద్దనె తన యను ✽ చరులగూడి
యభ్యసించెను విద్యల ✽ నవిరళముగ
భావనమునందె నిగమాంగ ✽ మార్గములను
నెఱిఁగి ధీవిశాలుండయి ✽ పఱఁగుచుండె.

మిత్రులనుగూడి మీలిత ✽ నేత్రుఁ డగుచు
నిత్యనిర్మల నిర్గుణ ✽ నిర్వికల్ప
నిర్జితేంద్రియ నీగుస ✽ న్నిధిని జేర్పు
మభయ మిమ్మని ప్రార్థించు ✽ ననవరతము.

కొంఁది దినములలోనె యా ♦ గుణవిశార
దుండు బాల్యమునను జేయు ♦ దుండగములు
మాని ఘనతరమగు పార ♦ మార్థికవిష
యములఁ జింతనజేసెను ♦ నవిరళముగ

దివ్యసుందరమై తను ♦ దీప్తి మెఱయ
జనుల మానసములను నా ♦ శ్చర్యపూరి
తములుగా జేసె తనయద్భు ♦ తమగుచర్య
వలన నీ బాలకుని భగ ♦ వానుఁడనిరి.

జవ్వనుండగు నవ్వన ♦ జాయతాక్షు
సోయగముఁగాంచి జనులెల్ల ♦ చోద్యమంది
అంతరంగముల్పొంగ గా ♦ రాంగుఁడనెడు
నామధేయ మొసంగిరి ♦ ప్రేమమీర.

సుగుణవతిని సురూపను ♦ సుకులజాత
శుద్ధవిజ్ఞానసముపేత ♦ శుభదచరిత
యైన బాలిక నుద్వాహ ♦ మాచరింప
దలఁచి శుభలగ్నమందు ము ♦ దంబుమీర —

సుగుణభూషణుడైన యా ♦ సుతునకెలమి
రాధికాంశసంభూతయా ♦ రాజవదన
నంచితముగ విష్ణుప్రియ ♦ యనెడుకన్య
కామణిని బెండ్లిచేసిరి ♦ కౌతుకమున.

ప్రవిమలానంద జలధరమూ • భ్రములగుచు
నలశచీంద్రులకై వడి • వ తులవై భ
వంబునొందుచు నీ మిథు • నంబు భువిని
జగదతీత విఖ్యాత య • శము గడించె.

పూవునకుఁ దావియుంబోలె - బొల్పుమీర
కొన్ని దినములు సంసార - గోష్ఠినుండి
నంత సన్యాసి యగుటకు - నాత్మనెంచి
ప్రేయసికిఁ దెల్పె దన సద - భీష్టమెలమి.

అంతఁ దనపతిపోకకు - నంతరంగ
మందుగుందుచు పోవల - దంచుమిగుల
రాలు గరుగఁగ వాపోవు - రమణి నెటులొ
నూఱడిలఁజేసి మాతను - జేరఁజనియె—

తల్లిపాదాబ్జములకు వం - దనమొనర్చి
వేచియుంటిని నీ యాజ్ఞకై - విమలచరిత!
శీఘ్రగతి నను బంపు మా - శీర్వదించి
యని మఱల భక్తిమీరగ - ననియెనిట్లు—

‘ జనని! నీ వెఱుంగనిది యీ - జగతిఁగలదె?
ధర పరోపకారార్థ మి - దం శరీర
మనుచు భోధించు నార్యోక్తి - ననుసరించి
స్థిరమతిని సన్న్యసించెద - నెల వొసంగుము! ’

'లోకమాన్యుఁడవైననీ - వీకరణిని
సర్వసంగముక్తుఁడవయి - సంచరింప
జీవముల నిల్చు టెట్లు? వ - చింపుమయ్య!
నన్ను విడనాడిపోవుట - న్యాయమెట్లొ?

ఆలకింపు నా జన్మర - హస్యములను
నాశరహితుఁడౌ భగవాను - నామ మహిమ
మింపు మీరఁగ భువిని వ్యా - పింపఁజేయ
నుద్భవించితినమ్మ! నీ - యుదరమందు.'

కాన దేశాటన మొనర్చి - కఠినదీక్ష
నఖిల ధర్మ సంరక్షణ - మాచరింప
జనుల సంసారదుఃఖ సం - చయము వాప
జననమందితినమ్మ, ని - జంబుసుమ్మ!!

అమ్మ! నా మనవిని విను - మమ్మ! కరుణ
నంతరాత్మ సమ్మతినొంద - దైనఁగాని
వగవనేటికి జననీ? యీ - వసుధయందు
తిరిగి జన్మించి మీ కోర్కె - దీర్తునమ్మ!

అని వినమ్రత సనుమతి - నందిభార్య
కభయ మొసఁగెను పరమ ద - యాళుఁడగుచు
వరుసతో సర్వతీర్థ సే - వనము జేయ
బయనమై చనియెను జగ - త్పాలకుండు——

ప్రజల మానసములయందు - భక్తిబీజ
ములను నాటుచు ప్రతిగృహం - బునకు నేగి
నిఖిల పాపఘ్నులుగ జేయు - నిరుపమాన
కృష్ణభక్తిని బోధించి - కీర్తిఁ గాంచె.

కుక్షినింపుచు ప్రాల్మాలి - కుటిలప్రకృతి
సేవ మున్గుచు నున్మత్త - చిత్తులగుచు
నిహసుఖమె శాశ్వతంబని - యెంచిజీవ
ములను గోల్పోవ దగదని - బోధఁ జేయు.

అతని పావన మధుర వా - క్యాళి వినుట
వలన విషయసుఖేచ్ఛలు - వదలి సతము
బ్రహ్మజిజ్ఞాస యుదయించి - ప్రకృతితీవ్ర
మడఁగి విగతకల్మషచిత్తు - లగుదు రహహా!

విద్యయన ముక్తినిడు బ్రహ్మ - విద్యయగును
గాని యక్షరసాంకేత - మైనవిద్య
విద్యగాదని ప్రజలకు - విశదపఱచె
నమృతమును కలకంఠ వే - రన్నమాడ్కి.

భువనములనెల్ల పావనమ్ముగ నొనర్చు
జ్ఞానమొసఁగు నతని యుప - న్యాసచయము
వినుటవలనను చైతన్య - గనుటవలన
నఖిలజనులకు నాహ్లాద - మతిశయిల్లె.

స్వేచ్ఛమగు బౌద్ధమతధర్మ - శాస్త్రములను
మరుగుపరచి కృత్రిమబౌద్ధ - మతము స్థాప
నంబు జేసిన కుమతులా - నాస్తికులను
నణచి ధర్మము స్థాపించె - నవనియందు.

అగణిత చరితుడైన గౌ - రాంగుఁడెలమి
క్షితికి ముమ్మారు లలి బ్రద - క్షిణమొనర్చి
భావమున నిర్భరానంద - భరితుఁడగుచు
లీలలను భువిలోన జా - లింపనెంచె.

ఉదయమున లేచి గౌరాంగుఁ - డొకదినమున
వీతరాగులై తన్నుసే - వించునట్టి
ముఖ్యభక్తులఁగూడి స - ముద్రమునకు
జనియె స్నానార్థమై సర్వ - జనులు బొగడ.

విమలమైన సాగరతరం ♦ గములపైన
నగుమొగము చెన్నుగుల్క నా ♦ నందనృత్య
మును నొనర్చుచు కొంతద ♦ వ్వవరు నేగి
మాన్యచరితుఁడు సాగర ♦ మగ్నుఁడయ్యె.

సజ్జనావను నాశ్చర్య ♦ చర్యలతని
భక్తులందరుగాంచి వి ♦ భ్రాంతినొంది
తమ మనంబుల భయవిషా ♦ దములుగలుగ
నిలచి రచ్చోట ననిమిష ♦ నేత్రులగుచు.

పిదప తమ నెలవుల కేగి ♦ ప్రేమమయుని
చేష్టలను వింతవింతగ ♦ జెప్పుకొనంగ
పురజనులు చాల సాశ్చర్య ♦ పూరితులయి
స్తుతుల నొనరించి రాతని ♦ సుగుణ తతుల.

వాసిగాంచిన బంగాళ ♦ దేశమందు
వరలు శ్రీ స్వర్ణముఖి యను ♦ పురములోన
నాల్గువందల యేండ్ల కీ ♦ నాశరహితు
డుద్భవించెను తిరిగి మ ♦ హాద్భుతముగ.

మున్ను విడిచి వచ్చిన కార్య ♦ ములను జేయ
నంచితముగ శ్రీగౌరాంగుం ♦ డవతరించి
నట్టి తిథి వార నక్షత్ర ♦ మందు జనన
మందె హారనాథుండనగ నీ ♦ యవనియందు.

ప్రేమ దమలీల మరల జూ ♦ పింప నెంచి
ధరను హారనాథుం డయ్యెచై ♦ తన్యు డెలమి
అవని భగవతీసుందరి ♦ యయ్యెను శచి
మహిని విష్ణుప్రియ సుకు ♦ మారి యయ్యె॥

స్వర్ణముఖి పురమున నివా ♦ సమును జేయు
ధర్మ రతుడు మనోహర ♦ దాసు డెలమి
ఆదివిష్ణు వచ్చోటనే ♦ యవతరించు
నంచు నంతకు మును ప్రవ ♦ చించి మించె.

అల్ల ప్రహ్లాద శుకనార ♦ దాదులవలె
నామమహాత్మ్మని దివ్యనా ♦ మామృతమును
గ్రోలి పావనులగుచు నై ♦ కుంఠపదవి
జెందుదు రటంచు బల్కెనా ♦ శ్రీకరుండు.

మాధవుని నామమను మృదు ♦ మధుర రసము
ద్రావి మైమరచిన గోప ♦ తతులమాడ్కి
భక్తులొనరించు నాప్రభు ♦ భజనతోడ
నీ జగంబు ప్రతిధ్వను ♦ లిచ్చుచుండు

వసుధలో పదునెనిమిది ♦ వందల యిరు
వదయి దవ వత్సరమున శు ♦ భదినమైన
జులయి రెండవ తేదీని ♦ నీలగాత్రు
డుద్భవించెను దీనుల ♦ నుద్ధరింప

రమ్యగుణ కోవిదుడు జయ ♦ రాముడనగ
సూరిజననుత భగవతీ ♦ సుందరియన
బరగు కీర్తి విభ్రాజులే ♦ పావనునకు
తల్లి దండ్రులై యుండిరి ♦ ధాత్రియందు॥

నీమమున సుందరీజయ ♦ రాములెలమి
నెమ్మదుల భక్తిసారవ ♦ శ్యమ్మునొంది
నయ విశారదులయి ధన ♦ వ్యయమమితము
గానొనర్చి దేవళము స్వ ♦ గ్రామమందు॥

దీక్షతోడ పరీక్షించి * మోక్షనాథు
బాలశశివాళి నందుల * పాదుకొల్పి
వినయమున దీపధూపనై * వేద్యములను
ననవరతము సమర్పించి * యాశ్రముగనిరి.

ఈ మహామహులకు శివ * రాముండ నెడు
పుత్త్రకుండును కమలయను * పుత్త్రికయును
గలరు శ్రీ హారనాథుని * కంటె పెద్ద
వారు సువిచారు లనుపమో * దారులవని.

అచిర కాలముననె విద్య * నభ్యసించి
నీతిపరులన ప్రబల వి * ఖ్యాతివడసి
భువిని వెలిగిరి ధీపరి * పూర్ణులగుచు
క్రమముగాం గొన్ని సంవత్స * రములు గడచె.

స్వర్ణముఖియందు నెలకొన్న * స్వగృహమందు
రాజితముగ కమల శివ * రాముడు తమ
మాతతో నివసించు స * మయమునందు
సాధువాక్కుం దరుదెంచె నా * శ్చర్యగతిని.

స్వచ్ఛ కౌముదీకాంతుల * సమముగాగ
దివ్య తేజోమయంబగు * తేజ మొప్ప
రామణీయకమగు నగు * మోముతోడ
వచ్చెనా ధీరుండటకు న * వారితుండయి.

సుందరీదేవి నివసించు * మందిరమున
కరిగి యామెనుగాంచినే * నతిథినమ్మ
ఆకలికి నోర్వఁజాల నా * హార మొసఁగు
మనుచు వడిగ శివాలయ * మునకుఁ జనియె.

పూత చరితుఁడౌ నా సాధు * పుంగవుండు
దేవళంబున నామహా * దేవు నెదుట
సొంపుమీర ధునిని బ్రజ్వ * లింపజేసి
విమలమతియయి యచ్చోట * విశ్రమించె.

అపుడు భగవతీదేవి శి * వాలయమున
కరిగె నాహారమునుగొని * యమితభక్తి
నా మహాత్మునికొసఁగి తా * నటుపయిని శి
వునకు బ్రణమిల్లి నిలిచెనా * వనజగంధి.

ఆ ఘనునికడ శలవును * నంది పిదప
నమ్రయై ద్వారమును బంధ * నంబొనర్చి
బీగమును వైచి గృహమున * కేగి సుఖము
గా గడపె నా దినంబును * కమలనయన.

మరుసటి దినంబునందు ప్ర ♦ భాతసమయ
మున నె యతనికి నుపచార ♦ ములను జేయ
నెంచి దేవళమున కేగి ♦ యుచితముగ
బీగమునుదీసి లోనికి ♦ వేగజనియె.

పూజకై వస్తుతతులను ♦ బాసగఁగూర్చి
భక్తితో దెచ్చెనటవనా ♦ భాసురాంగి
అచట నాతఁడు లేక చి ♦ హ్నములు లేక
యుండుటను గాంచి విస్మయం ♦ బందెమదిని॥

రమ్యగుణసాంద్రుఁడగు జయ ♦ రాముఁడూర
లేసితరి నద్భుతంబగు ♦ లీలఁజూపి
చనినసాధువు జయరాము ♦ స్వప్నమందు
నచట సాక్షాత్కరించె ద ♦ యాళుఁడగుచ॥

వడిగ నేతెంచె కలకత్త - విడచి స్వర్ణ
ముఖికి భార్యను గనుగొని - ముదముమీర
'దేవి! వచ్చెనా? కడచిన - దినమునందు
సాధు వాక?' డని ప్రశ్నించె - సాదరమున.

సాధువునుగూర్చి యడుగ నా - శ్చర్యమంది
ముగసి కెరగించెనాతని - మహిమములను
పలికె నాతఁడు తెల్పెను - స్వప్నమందు
గనిన వినిన వృత్తాంతంబు - వనివితీవ.

స్వర్ణముఖికేగినాఁడ, నీ - సతిని గాంచి
నాఁడ, నాహారమునుగొని - నాఁడ, నచటి
దేవళము గాంచినాఁడ, సం - దేహమంద
వలదు తృప్తినొందితినని - పలికె మాని.

కాన తత్తరమంది వే - గముగ నిటకు
వచ్చియుంటినీ కెరిగింప - వలయుననుచు.
నిపుడు శాంతించెనాచిత్త - మిందువదన
యనియె నా జయరాముడు - హర్షమంది

పిదప నొకవత్సరమునకు - ప్రేమనిలయు
డవతరించెను వీరి గృ - హంబునందు
ఘనుడు (శ్రీ) జయరాముడు - కాలధర్మ
మందె నందరు దుఃఖాబ్ధి - యందుమున్గ.

తండ్రి పరలోక గతుఁడైన ♦ తరిని హరుఁడు
తప్పటడుగులతో తండ్రి ♦ దరిని జేర
పలుకకుండుట గని పసి ♦ బాలుఁడగుట
కతన నేడ్చుచు దనమాత ♦ కడకు జనియె॥

ఊరడించిన హరనాథు - డూరకొనక
పోరువెట్టుచు జననిక - పారమైన
వెతను గల్గించుచుండిన - విధముగనిన
పురజనులు విషాదముతోడ - నరిగి రపుడు.

క్రమముగా కొన్ని దినములు - గడచె నటుల
నైదు వత్సరముల ప్రాయ - మరుగుదెంచి
నపుడు పాఠశాలను విద్య - నభ్యసింప
జేసుకనెయున్న పినతండ్రి - చెంతకరిగె.

శాంతియుతుఁడై మెలగుచు నా ♦ చార్యునొద్ద
సవినయంబుగ నాతడు ♦ జదువ నేర్చె
సోదరునితోడ పినతండ్రి ♦ సుతులతోడ
నైకమత్యముతో నుండె ♦ ననవరతము.

ఒకదినంబున తోడిబా ♦ లకులతోడ
నాడుచుండగ భాస్కరుం ♦ డస్తమించె
తోడు లేకుండ దనయన్న ♦ తో గృహమున
కరుగుదెంచుచు నుండగ ♦ నద్భుతముగ.

వారితో నెవ్వరో యసా ♦ ధారణోన్న
తమగు దృఢశరీరుండు నా ♦ తనపురుషుడు
వడివడిగ వెంట బోయక ♦ నడచి వచ్చు
చున్నరీతిని దోపఁగ ♦ చోద్యమంది.

తమ్మునకు జూపె మేడ యం ♦ తస్తువఱకు
నున్న యాతని శిరమును ♦ కన్నులార
జూచి శ్రీహారనాథుడా ♦ శుభదచరితు
జేర జనియెను భక్తితో ♦ చిత్తమలర.

కాంచ నామహాత్ముని నాభి ♦ కమలమందు
రమ్యమై దివ్యతేజోవి ♦ రాజిత మయి
చక్రసన్నిభ మగు జ్యోతి ♦ చాల మెఱయు
చుండె సౌదామినిన్ మించు ♦ సొగసు గల్గి.

వేష్టి యొక్కటి కటియందు ♦ వెలయుచుండె
లలితమా జన్నిదంబు ప్రే ♦ లాడుచుండె
దెల్లనగు శరీరము తేజ ♦ రిల్లుచుండె
అరుణకాంతితో చరణంబు ♦ లలరుచుండె.

బాలుడగు హరనాథుండు ♦ భయము లేక
సహజ ధైర్య సంపన్నుడై ♦ శాంతమతిని
మృదులతరమగు నాతని ♦ పదము లంటి
మ్రొక్కినంత నాతడు నగు ♦ మోముతోడ.

శ్రీహరా నీమదిని దలం ♦ చిన విధమున
బంధువైనట్టి ద్వారకా ♦ పతిని గాన
టంచు పాదములను విడి ♦ పించుకొని యు
రిగెను దవ్వుగ నతండు శీ ♦ ఘ్రగతితోడ.

అంచితంబగు నతని దే ♦ హంబున గల
శీతల సుగంధ వాసన ♦ చేత నలరి
సత్వరముగ హరుడు బరవ ♦ శత్వమంది
స్మృతిరహితు డయ్యె నంత నా ♦ శ్రీకరుండు.

చేరువను గల యొకచెర్వు ♦ చెంత కరిగి
వడిగ జలతరంగములపై ♦ నడచి కొలను
నందు నంతర్హితుం డయ్యె ♦ నతని చర్య
జూచి శ్రీహరనాథుని ♦ సోదరుండు.

భీతితో పరుగిడె గృహా ♦ భిముఖుఁ డగుచు
భయమువలనను మూర్ఛిల్లె ♦ బాలకుండు
శ్రీహరుం డట నిల్చి ని ♦ శ్చేష్టుఁ డయ్యె
తల్లి యాతనిఁగూర్చి త ♦ త్తరము నొందె.

రయమున వెదకవచ్చెను ♦ ప్రియతనూజు
నిర్వికారుఁడై యచటనె ♦ నిలచియున్న
కొమరునిం గాంచి కౌఁగిటఁ ♦ గ్రుచ్చి యెత్తి
బుజ్జగించి లోనికిఁ గొని ♦ పోయె నపుడు.

సేద దీర్చుచు శివరాము ♦ చెంత జేరి
భయరహితునిగ జేసె న ♦ పారప్రేమ
మెల్లగా గత వృత్తాంత ♦ మెల్ల దెలిసి
కొని కుమారుల దీవించె ♦ కూర్మిమీఱ.

క్రమముగా కొన్నియేండ్లు సు ♦ ఖముగ గడచె
వచ్చె హారునకు బదమూఁడు ♦ వత్సరముల
ప్రాయ మపుడు వివాహంబు ♦ జేయ నెంచి
తల్లి వధువుకొఱకు బ్రయ ♦ త్నంబు జేసె.

శ్రీయుతుఁడగు కందర్పనా ♦ రాయణుని గృ
హంబునందున నమితము ♦ దంబు మీఱ
కొఱతవడిన పనుల జేయ ♦ ధరను మరల
నమలచరిత విష్ణుప్రియ ♦ యవతరించె.

ముద్దుబాలిక సోయగ ♦ ము దిలకించి
పురజనులు నిర్భరానంద ♦ భరితు లగుచు
నారమణికి శ్రీకుసుమ కు ♦ మారి దేవి
యనుచు ప్రేమను నామధే ♦ యంబు నిడిరి.

సుగుణవతి యై మెలంగు కు ♦ సుమకుమారి
యనుదినమును శ్రీహరునితో ♦ నాటలాడు
కొనుచు వర్ధిల్లుచుండె గా ♦ వున ముదమున
హరున కాలతాతన్విని ♦ బరిణయంబు.

జేయనెంచి కందర్పనా ♦ రాయణుండు
సుందరీదేవి యనుమతి ♦ నొంది పిదప
పెండ్లి నొనరించె నాతఁడు ♦ పేర్మితోడ
వార లిరువురకును మహో ♦ వైభవముగ

హరుఁడు వేడ్కతో పరిణయా ♦ నంతరమున
కీర్తివిలసితుఁడైన శ్రీ ♦ కృష్ణుఁ డవని
నుద్భవించిన దినమున ♦ నుత్సవమును
జరపి "హరిసేవ" యను సమా ♦ జంబు నొకటి.

స్థాపనము జేసి మిగుల ను ♦ త్సాహముతోసి
బాలకులతోడ నట కేగి ♦ భక్తిమీఱ
శాంతచిత్తుండై విశ్రాంతి ♦ సమయములను
భజన మొనరించుచుండె నా ♦ సుజనహితుఁడు.

క్రందుగా క్రిందితరగతు ♦ లందు మొదల
నారితేరె సోనాముఖి ♦ యందు జదివె
వరమతిని బడునెనిమిది ♦ వందల యెను
బదియు నేడవయేటను ♦ జదివె నెఫ్ యె.

అంత బద్వానురాజవి ♦ ద్యాలయంబు
నందు జేరెను పిదప శ్ర ♦ ద్ధాన్వితుండయి
అచట విద్యార్థిగా నున్న ♦ యప్పు డతనికి
తిరిగి కాన్పించె నా దివ్య ♦ పురుషుం డెలమి.

శైశవంబున దమకు ద ♦ ర్శన మొసగిన
విధము నాత్మను దలచుచు ♦ విస్మయంబు
జెందె పిదప సంకీర్తన ♦ జేయుచున్న
సమయమున ననుచరసహి ♦ తముగ నతడు.

తిరిగి మూడవమాఱు శ్రీ ♦ హరునకు బల
రామకృష్ణులరీతి గా ♦ రాంగునివలె
మగుడ నప్పుడె నిత్యానందు ♦ నిగను దర్శ
నం బొసంగెను సమితాద ♦ రంబుతోడ.

సేవ యొసగి రహస్యలీ ♦ లావిభూతి
విశదపఱిచెను నంత నా ♦ వినయశీలు
డాత్మలోన ధ్యానించుచు ♦ నవశు డగుచు
చదువులను విరమించెను ♦ జడునిభంగి.

శ్రీసుమహారుం డేకాగ్ర • చిత్తుఁ డగుచు
సవిరళం బగు భక్తి న • హర్నిశముల
దీక్ష వహియించి బడి లేని • దినములందు
శ్రీధరుని నామజపమును • జేయుచుండె.

సంతసంబు నొసంగు వ • సంతకాల
మరుగుదెంచె శ్రీఠాకూరు • హారుఁడు తనదు
శలవుదినములలో బందు • గులను జూడ
స్వర్ణముఖికి నేతెంచె వి • శ్రాంతికొఱకు.

సౌమ్యమతితోడ దన దివ్య • సౌధమందు
బగటివేళ నాతఁడు శయ్య • పై బరుండి
కన్ను మూసినయంత నా • ఘనుఁడు దివ్య
స్వప్న మొక్కటి గాంచె నా • శ్చర్యగతిని.

ఇంద్రలోకము కేగి దే • వేంద్రుసభను
ముగురుమూర్తు లచట దమ • పువ్వుబోండ్ల
గలసి ముదమున తమ వే • దికల నలంక
రించి యుండినటుల దిల • కించె సంత.

హారుని రాకను గాంచి ని • ర్జరులు మదుల
ముదము నొంది ప్రత్యుత్థాన • ము నొసరించి
వేడ్క మునిసంఘముల్ దన • వెంట రాగ
నర్ఘ్యపాద్యాదు లొసగె న • య్యమరవిభుఁడు.

సరళహృదయుఁ డౌ పాకశా ♦ సనుని చెంత
నాసనంబు నొసంగెన ♦ బ్జాసనుసతి
వినయమతి నా సభాధ్యక్ష ♦ తను వహించి
నిలచి మృదుమధురోక్తుల ♦ బలికె నిట్లు.

హరుని తన వ్రేల జూపుచు ♦ నజునిరాణి
గానకళయందు మన మీఁజ ♦ గాన గాన
జాల మీతని గెలువగా ♦ జాలువాని
గాన ముదము నొసంగు నీ ♦ ఘనుఁడు మనకు.

శివసహస్రనామస్తోత్ర ♦ ము వరుసగను
నితఁడు గాన మొనర్ప స ♦ మ్మతము నాకు
మీ యభీష్టము దెల్పుఁడీ ♦ మిత్రులార
మునిజనోత్తములార త్రి ♦ మూర్తులార.

వాసవుండు శివుడు కమ ♦ లాసనుండు
మాధవుండు పద్మయును ను ♦ మాసతియును
దేవగణ మంతయును సమ్మ ♦ తిని దెలుపగ
గాన మొనరించె మధురంబు ♦ గా నతండు.

రమ్యమైన ప్రాకృతశరీ ♦ రంబు స్వర్ణ
ముఖిని శయ్యపై విశ్రాంతి ♦ సుఖము ననుభ
వించుచుండి స్వప్నమున నా ♦ విమలయశుఁడు
గాన మొనరించుచుండుట ♦ గాంచె జనని.

మాన సానందకరముగ ♦ గానము నొన
రించు పుత్రుని గన్గొని ♦ మించు వేడ్క
భగవతీదేవి యానంద ♦ పరవశమున
కౌఁగిటను జేర్చె నతఁడు మే ♦ ల్కాంచె నంత.

స్వప్నమున శివస్తుతుల నా ♦ సరణి నెట్లు
పాడగా జాలితి వటంచు ♦ ప్రశ్న జేసి
శివుని సన్నిధి మరల సం ♦ స్తవ మొనర్ప
మనిన నే నేమెఱుంగ నో ♦ యమ్మ యనియె.

జనని కోర్కెని దీర్పగా ♦ జాల నైతి
ననుచు మనమున జింతింప ♦ నద్దినమున
గాన మొనరించినట్టి శ్లో ♦ కంబులు గల
పొత్త మొకటి లభించె న ♦ ర్వోత్తమునకు.

అపుడు మాతతో గలసి శి ♦ వాలయమున
కరిగె నట నైజ మాధురీ ♦ గరిమతోడ
సోమశేఖరుమీద సు ♦ శ్లోకములను
మార్దవముగ బాడె నసుర ♦ మర్దనుండు.

సామగానలోలుం డగు ♦ సాంబమూర్తి
వేణుగానప్రియుం డగు ♦ విష్ణుమూర్తి
మున్నయినప్రముఖుల స్తోత్ర ♦ ముల వడసిన
మానిసి గానమున్ వర్ణింప ♦ తరమె మనకు.

లక్క-వ్యవహారమందు చా ♦ ల ధనమును గ
డించి సత్యపథమున జ ♦ రించి కాల
ధర్మ మొందె హరునితండ్రి ♦ ధనము నష్ట
మయ్యె గ్రహచారవశముచే ♦ నతని గాంచి.

ద్రవ్య మార్జింప దగిన సా ♦ ధనము వెదుక
వలయు నని దన ప్రియమాత ♦ బలికె గాన
హరుడు బి. య్యే పరీక్షయం ♦ దారితేరి
నంత యుద్యోగ మొనరింప ♦ నాత్మ నెంచె.

అతఁడు బి. య్యేను జదువుచు ♦ న్నపుడు రాజ
యక్ష్మభవబాధ వలన దే ♦ హము కృశించె
నైన నొరుల కెఱింగింప ♦ డయ్యె నౌష
ధమును గొనడయ్యె వీడడయ్యె ♦ ధైర్య మపుడు.

సుందరీదేవి భయమంది ♦ సుతుని గాంచి
కారణము దెల్పు మని కోర ♦ గా నతండు
దైవకృత మిది గాన న ♦ ధైర్య మంద
వల దనుచు ప్రియమాతతో ♦ బలికె ధృతిని.

హరుఁడు నిద్రించుచున్నట్టి ♦ తరుణమందు
నురముపై నేదియో యొక ♦ బరువు నుంచి
నట్లు దోపగ కను విచ్చె ♦ నంత బాల
కృష్ణు గనె దనపూర్వపు ♦ కృతమువలన.

తారహారశోభిత మయి ♦ దనరుచుట్టి
వక్షమున కాంతు లీను శ్రీ ♦ వత్స మలర
శిరముపై శిఖిపింఛంబు ♦ చెన్నుగుల్క
నాడుచుండెడు ననమోహ ♦ నాంగు గనరె.

తనయెదను దరహసితవ ♦ దనముతోడ
క్రీడసల్పెడు నా బాల ♦ కృష్ణుని గను
చుండ వక్త్రమునన్ చేయి ♦ జొన్పి రుధిర
ఖండమున్ దీసె నాతఁ డ ♦ క్కజమునొంద.

నంతలోనె నంతర్హి ♦ తుండయ్యె బాధ
దొలగె హరు డేగి దనమాత ♦ తో జరిగిన
దెల్ల దెల్లముగా దెల్పె ♦ దెల్లవాఱె
నంత నాఖండమున్ గాంచి ♦ వింత నొందె.

సుందరీదేవి దన ప్రియ ♦ సుతుని గాంచి
బలికె నిట్టుల నానంద ♦ పరవశమున
బాలకృష్ణుఁడు సద్భక్త ♦ లోలుఁడు గద
పుత్రవాత్సల్యమున నిన్ను ♦ బ్రోచె పుత్ర.

పిదప నొకనాటిరాత్రి సం ♦ ప్రీతితోడ
పుష్పసుత గూడి తన మృదు ♦ పుష్పశయ్యా
జేరి నిద్రించుచుండ వి ♦ చిత్రగతిని
గలిచె నొకకృష్ణసర్ప మా ♦ కాంత నపుడు.

బాధచే నేడ్వసాగె నా ♦ పడఁతిమిన్న
నిర్వికల్పసమాధిలో ♦ నిలచియుంట
చే కుసుమహరుఁ డయ్యింతి ♦ చేష్ట దక్కి-
యేడ్చుచుండుట గూడ దా ♦ నెఱుగడయ్యె.

అచట గలవార లెల్ల నా ♦ యతివ రోద
నంబు విని యెద్దియో యపా ♦ యంబు గల్గె
నంచు జనుదెంచి గాంచి మం♦త్రించి యక్ష
తలను జల్లిరి యవ్వి ని ♦ ష్ఫలము లయ్యె.

అప్రియత్నంబుగ కుసుమ ♦ హరుని నోట
నుండి దిక్కులు మార్మ్రోగి ♦ యులికిపడగ
వెలువడియె నంత రాధ గో ♦ వింద యనుచు
స్మరణ మొనరింప నీబాధ ♦ సమయు ననుచు

అతివ యాతని మృదులవా ♦ క్యానుసరణి
వింత గొల్పగ రాధ గో ♦ వింద యనుచు
స్మరణమొనరింప బ్రతికె నా ♦ సరణి గాంచ
జనుల కత్తరి నాశ్చర్య ♦ జనక మయ్యె.

మరుదినంబున నతడు స ♦ మాధినిష్ఠ
వీడి స్మృతి నొంది మనమున ♦ విస్మయంబు
గల్గ నీయుదంతం బెల్ల ♦ గ్రిందుగ విని
వగచె జరిగిన దెఱుగని ♦ వానిఁ బోలె.

నాతి బ్రతుకుటగన్గొన్న • నాటనుండి
రాతి నాతిగ జేసిన • రామచంద్రు
డవతరించెను గాకున్న • నవని నెవరి
తరము మృతినొందకుంట కి • ద్ధరణిలోన.
అనుచు నాతని దగగొని • యాడి ప్రజలు
క్రిందివిధమున హారుని సం • కీర్తనముల
బాడి గుమిగూడి యాడిరి • పరమభక్తి
బాలకృష్ణుని వేడు గో • పకులమూడ్కి.

మత్స్యావతారము.

విశ్వసాక్షియై దనరెడు • వేదసమితి
ముచ్చిలిన సోమకుని ద్రుంచి • తెచ్చి మరల
సరసిజాతాసనునకు నొ • సంగి తీవు
అద్వితీయాప్రమేయ మ • త్స్యావతార.

కూర్మావతారము.

అమరులును దైత్యులును నమ్రు • తమును గోరి
మందరాద్రితో జలనిధి • యందు దఱచు
తరిని గొండ వీపున మోసి • దనరితీవు
ఆదిమధ్యాంతరహిత కూ • ర్మావతార.

వరాహావతారము.

పొందుగా హేమనేత్రుడు • భువనములను
చాపగతి జుట్టి కొనిపోయి • జలధి డాగ
సాగరము జొచ్చి వానిని • జంపి తీవు
ఆర్తజనరక్షణా వరా • హావతార.

### నృసింహావతారము.

బాలకుం డగు ప్రహ్లాదు ♦ బహువిధముల
బాధలను బెట్టుచుండ స్తం ♦ భమున నుద్భ
వించి కనక కశిపుని వ ♦ ధించి తీవు
అమరవందిత ఘనసృసిం ♦ హావతార.

### వామనావతారము.

భక్తమందారు డైన యా ♦ బలిని మూడె
యడుగులను దాన మిమ్మని ♦ యడిగి పిదప
నడుగు క్రిందనె వానిని ♦ నదిమి తీవు
అసురమర్దన శ్రీవామ ♦ నావతార.

### రామావతారము.

జలధి బంధన జేసి భూ ♦ జాత దెచ్చి
అతుల దుర్వార గర్వ మ ♦ దాంధు డగుచు
మించు రావణుగర్వ మ ♦ డంచి తీవు
అవనిజా చిత్తచోర ♦ రామావతార.

### బలరామావతారము.

హాసమందున దాల్చి హ ♦ లాయుధమును
తీర్థ సేవన మొనరించి ♦ ధీరమతిని
నంచితంబుగ దుష్టుల ♦ ద్రుంచి తీవు
ఆర్యజనవినుత బలరా ♦ మావతార.

### పరశురామావతారము.

అరయ కార్తవీర్యుడు వేల్పు ♦ టావుపగిది
వచ్చి జమదగ్ని చంపిన ♦ వానిపైన
నలిగి క్షత్రియులను దెగ ♦ టార్చి తీవు
అరిజనాంతక పరశురా ♦ మావతార.

## బుద్ధావతారము.

ఘనతరం బగు బుద్ధ యో ♦ గంబు జేయు
చోట నవిదలమూనముల్ ♦ చూరఁగొనఁగ
వృద్ధ వేషముతో నుద్ధ ♦ రించి తీవు
అచలరూపసుచరిత బు ♦ ద్ధావతార.

## కలికావతారము.

కలియుగంబున కడు క్రూర ♦ కర్ములై వ
సలెడు దుష్టుల నిర్మలా ♦ శ్వంబు నెక్కి
నిహతులను జేసి ధర్మంబు ♦ నిలుపు దీవు
పావనాకార ఘనకలి ♦ కావతార.

## ప్రేమావతారము.

బ్రహ్మహత్యాది పాతక ♦ బాధితు లగు
జనము లెల్ల నీమృదుపద ♦ స్పర్శనమున
విగతదోషులై పరమ ప ♦ విత్రు లైరి
అఘవిదూర సుధీర ప్రే ♦ మావతార.

అనుచు నుతియింప హరుఁడు స ♦ మాదరమున
వాగి జేరి దరస్మేర ♦ వదను డగుచు
కీర్తనము సేయ మొదలిడె ♦ కృష్ణ బాల
కృష్ణ! కృష్ణా! యటంచు ను ♦ త్కృష్టమతిని.

ఐహికాముష్మికసుఖంబు ♦ లందగోరి
తాల్మితో భగవాను ప్రా ♦ ర్థనలు సేయ
స్థాపనము జేసె ప్రేమ ప్ర ♦ చారక మను
సంఘ మొక్కటి దనయూర ♦ సదయు డగుచు.

అఖిలజనులకు మానసా ♦ హ్లాద మొసఁగ
జగతియందున నీసమా ♦ జంబు సాటి
మరియొకటి లేదు లేదు ము ♦ మ్మాటి కనఁగ
వైభవాప్తితో నయ్యది ♦ వఱలుచుండె.

జాతి మత భేదములు లేక ♦ సౌమ్యమతిని
జగతి మెచ్చఁగ ధమసమా ♦ జంబునందు
దిగ్జయముతోడ సద్యశో ♦ దీప్తితోడ
నతఁడు సంవత్సరోత్సవం ♦ బమర జేసె.

అంత హారనాథుసోదరుం ♦ డతని గాంచి
కినుకతో బల్కె నెందుల ♦ కీవిధమున
ధనము వెచ్చించి సోమరి ♦ తనము హెచ్చ
తిరుగుచుంటి వటంచు బల్ ♦ తీవ్రమతిని.

అగ్రకులమున బుట్టియు ♦ నధము డైన
నిన్ను బోలినవారల ♦ కన్న వస్త్ర
ములను నిడుటకంటెను వేరె ♦ మూర్ఖతమము
గలదె వేరొండు తెలప నీ ♦ ఖిల నటంచు.

నైన నాతనిచెవి సోక ♦ దయ్యె నన్న
వాక్య మొక్కటి యైన న ♦ వారితముగ
నచ్యుతునిపైన చిత్తంబు ♦ నమర జేర్చి
సంచరించుచు నుండె వి ♦ శ్వంబు మఱచి.

అస్మదీయోపదేశంబు • విస్మరించి
జడుడవై యున్న నిన్ను పో • షణము సేయ
జాల నెందైన బొమ్మని • జాలి లేక
నాజ్ఞ సేయగ భగవాను • నాత్మ నెంచి.

ధైర్య సాహసములతోడ • తక్షణంబె
బయన మయ్యె నయోధ్య యన్ • పట్టణమున
కచట నుద్యోగ మొనరింప • నతని జనని
యనుమతిం గొని ప్రియసతి • నచట విడచి.

అట నుపాధ్యాయుడై యుండ • నచటజనుల
ప్రబలతర గౌరవమునకు • బాత్రుడయ్యె
నంత కాశ్మీరమున కేగ • నాత్మ నెంచి
సత్వరంబుగ బయనమై • జనియె ధృతిని.

పిదప నాతండు రావలు • పిండి యనెడు
గ్రామమున విశ్రమింపగా • 'కాళిబాగ'
యనెడు సత్రమునకు బోయె • నమితశ్రమను
దీర్చుకొని నంచి యట నొక • దినము గడపి.

తిరిగి పయనమై జనగ యు • త్సాహ మందె
నధికవర్షాయుతం బయ్యె • నవని 'జీల
మ'ను మహానది పొంగి మ • హాద్భుతముగ
దారు లన్నియు గనగ వి • ధ్వంస మయ్యె.

గాన నట నాఱుదినములు ♦ గడపి పిదప
నదిని దాట బ్రయత్నించ ♦ నామరూప
రహిత మైనవంతెనను గ ♦ రంబు గాంచి
యోచనము జేసె మది నమ ♦ యోచితముగ.

అంత నచ్చోట నై రోపి ♦ యన్ దొర పని
సేయుచుండుట గాంచి వి ♦ స్మితము జెంది
దరి కరిగి హరనాథు డా ♦ తని నెఱుంగ
నెంచి సంభాషణ మొనర్చె ♦ నీవిధమున.

ఎద్ది మీయూరు? మీనామ ♦ మెద్ది! ఇచట
నేమి సేయగ వచ్చితి రెఱుఁగ ♦ దెల్పుఁ
డనగ నాపేరు "హాట్కిన్స" ♦ ననెద రిచట
నిఁజినీరుగ నుంటి మ ♦ హీపతికడ.

దిట్టతనమున నావలి ♦ గట్టు జేర
నెద్ది యైన నుపాయంబు ♦ నెంచి చూచి
రమ్మని పొమ్మని కాశ్మీర ♦ రాజు పంప
నరుగుదెంచితి నిటకు సా ♦ హసముతోడ.

చాలతడవు బ్రయత్నించి ♦ శ్రమము నొంది
త్రాటి నొకదాని నావలి ♦ దరికి జేర్చె
పిదప రజ్జువు నట వారు ♦ బిగియగట్ట
హర్ష మొందెను హాట్కిన్స" ♦ నమిత ప్రేమ.

సేవకుని జీరి త్రాటిని ♦ జిక్కబట్టి
పొమ్ము మెల్లన మదిని ధై ♦ ర్యమ్ము బూని
జయము గల్గును మనలకు ♦ జంకు విడువు
మనగ సేవకుఁ డరిగె, శ్రీ ♦ హరుఁడు పిదప.

సాహసమున దా నారీతి ♦ జనగ నెంచి
ఇంజనీరును గాంచి ప్రే ♦ మించి మించి
మంచిమాటల నతని నో ♦ ప్పించి నమ్మ
తించునటు లొనరించి ♦ తరించె నదిని.

ప్రబలతరమగు పర్వత ♦ పఙ్క్తి నొకటి
గాంచె నాతఁడు పర్వతా ♦ గ్రమున నుండి
ప్రీతి నెవ్వడో చేయూపి ♦ పిలచినటుల
దోప మే ల్మే లటంచు సం ♦ తోష మొందె.

చనగ నెంచి మనమున సం ♦ శయము లేక
నుచితగతి శ్రీహరుడు మ ♦ హోన్నత మగు
పర్వతాగ్రమునకు నెగ ♦ బ్రాకి పోయి
చేతులం దట్టి నిల్చె నా ♦ శిఖరమందు

అంతలోన పటాపంచ ♦ లయ్యె నమ్మ
హాద్రి విభ్రాంతుఁ డగుచు మ ♦ హాద్భుతమును
గాంచి త్రుటిలోన దుమికె నా ♦ కలుషహరుడు
శౌర్యఘనులకు దలప న ♦ సాధ్యమెద్ది

అమ్మహాగిరి యాత్రవా ♦ హమ్మునందు
లీలమై పోయె భగవద ♦ ధీనము గద
జగము ద్రుంప పెంపగ నైంద్ర ♦ జాలకువలె
మెలఁగు నీశ్వరుమాయల ♦ దెలియ వశమె.

ఆర్తజనరక్షణుం డపా ♦ యమున నుండి
తన్ను రక్షించుకతన వం ♦ దనముల నిడి
శ్రమము వాపుకొనంగ వృ ♦ క్షంబునీడఁ
జేరి సుఖనిద్ర జెందె నా ♦ శ్రీధరుండు.

క్షుత్పిపాసలతోడ సం ♦ క్షోభ మొందు
మానవకళేబరం బెట్లు ♦ మనఁగ నేర్చు
నన్న పానీయ ఘృత శర్క ♦ రాళి లేక
మరుదనంబున మేల్కాంచి ♦ మమతి జెంది.

చింతనము సేయుచుండ వి ♦ చిత్రగతిని
ఫలము గాన్పించె నటవృక్ష ♦ పఙ్క్తిగనఁగ
అమృతఫలముగ నద్దాని ♦ నాత్మ నెంచి
శీఘ్రగతి దెచ్చి భుజియించె ♦ చిత్త మలర.

నగధరుఁడు జేరె నంత శ్రీ ♦ నగర మనెడు
పట్టణంబు జేరువగ గ ♦ న్పట్టుచుండ
నట 'జయంతప్రసాదుజ్ ♦ యనగ బరగు
మంత్రిశేఖరుఁ గాంచి ప్రే ♦ మంబు మీఱ.

సేమమా ధీరుఁ డైన కా • శ్మీరవిభుఁడు
మంత్రిసత్తమ! యనుచు న • మ్మాన్యచరితు
నడిగె నంతనె యతఁడు స • మాదరమున
హరుని జేరి నమస్కార • మాచరించి.

ఎందు బోవుచు నేడు మీ • రిందు వచ్చి
యుండిరో; కన మీమొగ • లొప్పు దొరఁగ
నలసి యున్నటు గాన్పింతు • రస్మదీయ
సేవలన్ బొనుఁ డించుక • సేద దీఱ.

విశ్రమింపుడు పిదప న • విస్తరముగ
దెలుపవచ్చును గల్గుసం • దేశములను
గండు! రం డని హరుని క • రంబు బూని
ప్రీతి లోనికి గొంపోయి • చేత మలర.

ఇష్టమృష్టాన్నమును భుజి • యింప జేసి
పొల్పుమీఱు సుగంధతాం • బూలము నిడి
శయ్య నిర్మించి లోనికి • జనియె ప్రముది
తాంతరంగుడై యచట వి • శ్రాంతి గొనియె.

కొంతవడికి మేల్కాంచె న • నంతరం బ
మాత్యశేఖర నేడు సే • మమున నుంటి
హాయి గల్గెను మీ సహా • యంబువలన
ధార్మికుల కసాధ్యం బెద్ది • ధరణి గనఁగ;

ననియె పిదప జయంతుఁడు ♦ హరుని గూడి
జనియెం గాశ్మీరరాజను ♦ స్థానమునకు
రాజు వీరల గాంచి గౌ ♦ రవ మొనర్చి
హరున కుద్యోగ మొసఁగె స ♦ ముచితముగ;

నచిరకాలమునందె శ్రీ ♦ హరుఁడు ఖ్యాతి
గాంచె నట; సత్ప్రవర్తనా ♦ కలితుఁ డగుట
కతన నురుదయామతిని భూ ♦ పతియు నతని
కున్నతోద్యోగ మిడియె కా ♦ లోచితముగ.

శ్రీనిలయుఁడు తదుపరి కా ♦ శ్మీరదేశ
మును విడిచి మాతృదర్శన ♦ మును నొనర్ప
వలయు ననియెడికోర్కె భా ♦ వమున వొడమ
ముదముతో బైనమై స్వర్ణ ♦ ముఖికి జనియె.

పురిని జేరినతోడ బ్ర ♦ పూతమతిని
మొదల నతఁడు దేవాలయ ♦ మునకు జని వి
నమ్రుడై దేవతాదర్శ ♦ నము నొనర్చి
పిదప గురువును జేరి సం ♦ ప్రీతి మ్రొక్కె.

మృదులహాసంబు మోమున ♦ బొదల భక్తి
జనని దర్శించి తన ప్రియ ♦ సతిని గాంచి
హితవచనముల బల్కె స్నే ♦ హితుల గనఁగ
నరిగె నాతఁడు భోజనా ♦ నంతరమున.

హితజనులు తమ చిరపరి ♦ చితుని గాంచి
సేమ మాగసి లలి సుఖా ♦ సీనుఁ జేసి
గడచినట్టి వృత్తాంతంబు ♦ లడిగి దెలుప
వార లాశ్చర్యమానసు ♦ లైరి పిదప.

అతఁడు తనమందిరంబున ♦ కరుగుదెంచి
మించువేడ్క భుజించి ని ♦ ద్రించుతఱిని
స్వప్న మొక్కటి గాంచె నా ♦ శ్చర్యచకితుఁ
డయ్యె నయ్యది వైచిత్ర్య ♦ మగుటకతన.

నెద్దియో పట్టణంబున ♦ కేగినటుల
రమ్యమై యొప్పు తేజోవి ♦ రాజిత మగు
మణిమయాంచితఘనసభా ♦ మంటపమున
నిండువేడ్కను నొకప్రభు ♦ వుండినటుల.

నొప్పుమీఱఁగ ప్రభుని పే ♦ రోలగమున
భక్తబృందంబు లానంద ♦ పరవశు లయి
తానముల రాగములను గీ ♦ తముల బాడి
తాండవం బొనరించుచు ♦ నుండినటుల.

మయునిసభ మించు దర్బారు ♦ మందిరమున
గనఁగ ప్రభుఁడు గౌరాంగుడై ♦ గ్రాలునటుల
నెల్లరకు నేత్రపర్వమై ♦ యుల్లసిలగ
నతనిమ్రోల నిత్యానందుఁ ♦ డడరునటుల.

చిత్రగతిని శ్రీహారుడు కా ♦ శ్మీరమందు
నంచితంబుగ ధరియించి ♦ నట్టి వస్త్ర
ములను దాల్చి నిత్యానందుఁ ♦ డలర నమిత
ప్రేమతో దన్ను చెంతకు ♦ బిలిచినటుల.

నరిగినంతనె సింహాస ♦ నంబు డిగ్గి
శ్రీహారుని గద్దెపై నధి ♦ ష్ఠింపజేసి
ముద్దు లొల్కెడు చిఱునగు ♦ మోముతోడ
నతఁడు వేఱొకతావున ♦ కరిగినటుల.

స్వప్నమందున గల రహ ♦ స్యము నెఱింగి
దనకు నమ్మహాత్మునకు భే ♦ దంబు లేద
టంచు మది నెంచె కొన్నినా ♦ ళ్ళకిగె నవల
తిరిగి కాశ్మీరమునకు దా ♦ నరిగె పిదప.

గడచె నాల్గువత్సరము లీ ♦ కరణి నొక్క-
నా డచట నతలవిహారి ♦ నంది యనెడు
నొకమహాత్ముడు గాంచి మ ♦ హోన్నతమతి
హారుని నవతారమూర్తిగా ♦ నాత్మ నెఱిఁగి.

వందనము సత్యసంకల్ప ♦ వనజనయన
వందనము విశ్వరక్షకా ♦ వనధిశయన
వందనం బిదె సుందరీ ♦ వరకుమార
వందనము సర్వలోకైక ♦వందిత హార.

యనుచు దండప్రణామంబు ♦ లాచరించి
నేడుగా కనులార నిన్ ♦ జూడనయ్యె
అమర గంధర్వ కిన్నర ♦ ప్రముఖులైన
నందరాని పదంబు నే ♦ నందగంటి.

జ్ఞానదాయకమగు నుప ♦ న్యాసకు లిల
లేక మనదేశ మజ్ఞాన ♦ భీక రాంధ
కారమునబడి కడతేర ♦ నేరకున్న
తఱిని నవతరించితి వహో ♦ ధన్యచరిత.

అనుచు నుతియింప నతలబి ♦ హారిని గని
చిఱునగవుతో హితమతి నా ♦ శీర్వదించి
గారదేవిని రాకకు ♦ కారణుఁడయి
వెల్గు నద్వైతచంద్రుఁడ ♦ వీవె కాదె.

అనఁగ నతలవిహారి సహ ♦ ర్షుఁ డయ్యె
హరుఁడరిగె దన నెలవున ♦ కమితకరుణ
యడర నీవెప్డు తలచిన ♦ నపుడె వచ్చి
దర్శనం బిత్తు ననుచు మో ♦ దమున బల్కి.

మరుదినమున నాతఁడు శ్రీన ♦ గర మనంగ
బరగు పట్టణప్రాంతపు ♦ వనమునందు
నింపుమీఱఁగ విహరింప ♦ నిచ్చ వొడమ
జనియె కాంతారమునకు ని ♦ స్సంశయముగ.

సంధ్యాసమయాన కాల్నడ ♦ జనుచునుండ
బాలభానుమయూఖాసం ♦ స్పర్శనమున
తప్తకాంచననిభ మగు ♦ తనువు డస్సి
చెమ్మటల్ గ్రమ్మ హరుమోము ♦ దమ్మియందు.

సాంద్రకాంతారవల్లికల్ ♦ శాంతి నొసఁగ
శారికాశుకగీతాది ♦ సరణి మిగుల
రమ్య మాధురీ గాన త ♦ రంగములను
నోలలాడుట గాంచి నే ♦ శ్రోత్సవముగ.

వలపులం జిల్కు చెంగల్వ ♦ కొలనులోన
స్నాన మొనరించి కరుణాబ్ధి ♦ శాలుఁ డటను
చోద్యముగ నాడు నెమళుల ♦ సోయగమును
గాంచి నెమ్మది హర్షించి ♦ మించె నంత.

లీలతో సింహ శరభ శా ♦ ర్దూలమృగము
లమితప్రీతిని నెఱపుచు ♦ హరుని జేరి
యవిరళానందపారవ ♦ శ్యమ్ము నొంది
నమ్రతను పాదముల మూర్కొ ♦ నంగ దొడఁగె.

కలకలము లొనర్చుచు కొతు ♦ కంబుతోడ
పక్షిసంతతు లాతని పైని ♦ వ్రాలె
పాము లమ్మహోదారుని ♦ పాదములను
జుట్టుకొనె నందియలభాతి ♦ పట్టు విడక.

సర్వమృగపంక్తు లామూ ర్తి ♦ సరస జేరి
ప్రబలతరవైరభావంబు • బాసి యతని
పైన ప్రేమను జూపుట ♦ ప్రభువు గాంచి
విస్మయాన్వితుం డగుచు న ♦ వ్విధమున నటు.

చాల తడవుండి యతడు స్వ ♦ స్థానమునకు
బోవ నుంకింప నా ప్రేమ ♦ పూరితు గని
అయ్యయొ మనలను వీడి తా ♦ నరుగుచుండె
ననంగ దీనతతో గాంచె ♦ నమృగాళి.

లోకకల్యాణ మొనరింప ♦ శ్రీకరుండు
జనన మందిన ఘనపుణ్య ♦ చరితుం డగుట
కతన దుష్టులు శిష్టులై • గాలుచుండ్రు
గాదె! యతని యధీనంబు ♦ గాని దెద్ది?

తదుపరి వసంతమందు శ్రీ ♦ తలనివాస
యోగ్యమైన శ్రీనగరమం ♦ దుండ నెంచి
రాజధర్మార్థపురిఁ జేరి ♦ రహిని నటకు
మార్చుకొనియెను బుధజన ♦ మాన్యుం డప్పుడు.

చక్రవర్తితో నట నివా • సంబు సేయు
చున్నతటి మిత్రతతితోడ ♦ జెన్నుగుల్క
రాజసభ కేగుచుండ మా ♦ ర్గమున హరుం డ
కాలమరణంబు నొందె నా ♦ కస్మికముగ.

మిత్రు లీతని వింత యా ♦ మృతిని గాంచి
చింతిలుచు నొక్క( డాతని ♦ చెంతనుండి
వేఱొక(డు శవదహనసం ♦ స్కారమునకు
యత్న మొనరింప పురిలోని ♦ కరిగె ధృతిని.

తదుపరి హరు(డు దన చిన్న ♦ తనమునందు
నన్నతో( బాఠశాలకు ♦ నరుగుచుండ
దర్శనము నొసంగిన మహో ♦ దారు( డచట
దక్షిణమున హరునకు బ్ర ♦ త్యక్ష మయ్యె.

పిదప గౌరాంగదేవు(డు ♦ పిలచి హరుని
'నీవు మరణించిన తెఱంగు ♦ నీ వెఱుంగ
జాలినాడవె' యనుచు బ్ర ♦ శ్నము నొనర్ప
నంత నశరీరవాణి దా ♦ ననియె నిట్లు.

గతదినంబున మధ్యాహ్న ♦ కాలమం దె
నే నెఱింగితి నిట మర ♦ ణించినటుల
నందుకొను మిదె కడసారి ♦ వందనం బ
నంగ నమ్మహాపురుషు(డు ♦ హరుని గాంచి.

సర్వమును బ్రహ్మమయ మని ♦ చాటుకతన
నీవు నాహితు(డవు చిన్న ♦ నాటనుండి
గంటి కంటికి ఱెప్ప ♦ కై వడి నిను
నిపుడు నీలో బ్రవేశింప ♦ నిచ్ఛ వొడమె.

నేను నీలోన నుండి నా ♦ నియమములను
ననుసరించి పూర్వము వీడి ♦ నట్టి కార్య
ములను బూర్ణముగా జేయ ♦ దలంపం దగిన
సమయ మిూసుదినమున నా ♦ సన్న మాయె.

గావున బహిర్గతుండవు ♦ గమ్ము నీక
ళేబరమున బ్రవేశించి ♦ లీల మరల
ప్రకృతి రంగమునందు న ♦ ర్తన మొనర్చి
వెల్లడింతు లోకమునకు ♦ వివిధగతుల,

ననంగ బ్రభువును దన కన్ను ♦ లార గాంచి
మహితభక్తి పూర్వక ప్రణా ♦ మ మ్మొనర్చి
"ధన్యచరిత! నీవదన ప ♦ ద్మమును గాంచ
దురితతతి బాసి నే గృతా ♦ ర్థుండ నైతి.

ననియె నపుడు, శ్రీహారుని దే ♦ హంబునందు
శీఘ్రగతి బ్రవేశించె నా ♦ శ్రీవిభుండు
దివ్యలాసుని సృష్టివె ♦ చిత్ర్యము గన
నతులితాశ్చర్య మానసుం ♦ డగుచు హారుండు.

బలికె నివ్విధంబున నీప్ర ♦ పంచమందు
సుందరం బగు నత్యంత ♦ సూక్ష్మవస్తు
జాల మంతయు నయ్యింద్ర ♦ జాలికువలె
జూపుచుంటివి ముద మొప్ప ♦ జూచుచుంటి.

పర్వతంబుల కావల ♦ ప్రక్క నున్న
పారరహిత మా జలధిగ ♦ ర్భంబున గల
చిత్రమగు వస్తుతతి నాదు ♦ చెంత నున్న
కరణి గాన్పించుచుండె నా ♦ కనుల కనఘ.

ఇద్ది యద్ది యనగ నేల ♦ నిద్ధర గల
చారుతర మా సకల చరా ♦ చరము లవిగొ
సలలితం బగు నీదు వ ♦ క్షస్థలమున
పుష్పమాలికారూప మై ♦ పొల్చుచుండె.

దలప నిందు నం దనెడు భే ♦ దంబులేక
నెందు జూచిన చిన్మయా ♦ నంద మొకటె
గాని వేఱొండు సృష్టిలో ♦ గానరాక
యుండె తావకసందర్శ ♦ నోత్సుకమున.

ననుచు నావిశ్వరూపంబు ♦ నందు లీన
మయ్యె దృటిలోన నాతని ♦ యాకృతి కడు
వింతమార్పును బొందె న ♦ వ్విధమును గని
చూపరులు దమమనముల ♦ నొద్యమందె.

తొల్లి చామనచాయగా ♦ దొడరుమేను
దివ్యతేజోమయం బైన ♦ దీప్తి నొందె
హరుడు ధర పునర్జీవితుం ♦ డైన వెనుక
ననుచు పురివార లానంద ♦ మంది రపుడు.

స్నేహితులతోడ నీవిధి ♦ జెప్పఁదొడఁగె
"నీశరీరమునం దున్న ♦ దేను గాను
ఉత్తమోత్తమ మగు నొక్క ♦ క్రొత్తవ్యక్తి
వ్యవహరించుచు నుండెన ♦ వారితముగ.

చిత్రమగా మహద్విషయముల్ ♦ జెప్పఁగోరె
రమ్యభావమరందత ♦ రఙ్గపంక్తి
పొంగి పొరలుచుండెను నంత ♦ రంగమందు
నెల్లు వివరింపగలనొ నే ♦ నెఱుఁగకుంటి.

నప్రయత్నంబుగా బల్కు ♦ నట్టినుడుల
వలన లోకవాసన మిమ్ము ♦ వదలిపోవు
బ్రహ్మజిజ్ఞాస యుదయించు ♦ ప్రకృతితీవ్ర
మడఁగి తాపంబు లుపశాంతి ♦ యగుట నిజము.

ఇద్దరను పాపశృంఖలా ♦ బద్ధు లగుచు
పుట్ట నేల గిట్టఁగ నేల ♦ పొల్పుమీఱ
జన్మరాహిత్యకర్మల ♦ సల్పి మీరు
మునులమార్గంబునం ♦ జని ముక్తి గనుఁడు.

ప్రభువు నారూపమున నిట్లు ♦ బల్కుచుండె
గాన హితులార నాదువా ♦ క్యానుసరణి
పాపభారము నామూపు ♦ పైన నుంచి
జనుఁడు బృందావనమున వి ♦ శ్రాంతి గనుఁడు.

చారు బృందావనప్రదే ♦ శములయందు
వికచ పుష్ప ఫల వనవా ♦ టికలయందు
విమల తోయ నదీ తరం ♦ గముల యందు
నింపు మీఱఁగ నట విహా ♦ రింప వచ్చు.

స్వర్గ నరకముల్ రెండును ♦ సమము గాన
నరకభయ మించుకంతయు ♦ నాకు లేదు
పాపజాలంబు లిడుమల ♦ పాలు జేయు
ననుచు సందియ మొందకుఁ ♦ డాత్మలందు.

నందు మిము వీడి శాంతి నే ♦ నందజాల
దత్పురికి వత్తు నిదె మార్గ ♦ దర్శి నగుచు
మీరు నను వీడగా నుద్య ♦ మింతు రైన
గాని మిము నేను విడజాల ♦ క్షణికమైన.

కృష్ణభక్తులై మీర లు ♦ త్కృష్టమతిని
మెలగుటను గాంచి హర్షింతు ♦ మించు వేడ్క
ననుచు ప్రేమగసార్ద్రవా ♦ క్యములతోడ
ప్రజల కుపదేశ మొనరించె ♦ ప్రథితయశుడు.

ఆశ యను పిశాచమును వి ♦ నాశనము నొ
నర్చి భవరూప మగు దారు ♦ ణానలమును
నార్పి తేజోమయం బౌ న ♦ నల్పకాంతి
రాజిలఁగ జేసె సుజనాంత ♦ రంగములను.

దారి గానక సత్కర్మ ♦ దూరులైన
మానవులవి శిథిలమనో ♦ మందిరముల
భవ్యమై యవ్యయం బగు ♦ దివ్యజ్యోతి
నంధకారము వెల్తురై ♦ యలరునటుల.

ప్రజ్వలింపఁగ జేసె నా ♦ ప్రజలమదుల
శాంతియుతులై చెలఁగిరి ని ♦ స్సంశయముగ
మగుడ చైతన్యమూర్తి ప్రే ♦ మమును గూర్చి
సకలజనరంజనము జేయఁ ♦ జాలు సుమతుల.

బలుక సమ్మహోదారుని ♦ పల్కుల విని
ప్రవిమలజ్ఞానశీలురై ♦ పవలు రేయి
నిర్వికల్పసమాధిలో ♦ నిలచి నిలచి
యమ్మహాతేజమందు వా ♦ రైక్యమంది.

తన్మయత్వంబుతో సత ♦ తంబు హరుని
లలిత ప్రేమ సుమముల న ♦ లంకరింప
మహిత దుర్వార గర్వత ♦ మము లడంగ
సౌఖ్య మందిరి తమ తమ ♦ శ్రమల బాసి.

పతితులను క్రూరరోగపీ ♦ డితుల ధీర
హితుల నిర్మలజ్ఞానసం ♦ యుతుల జేసి
వారి భవరోగములను న ♦ వారితముగ
ననుభవించుచునుండె ద ♦ యాళుఁ డగుచు.

హారుని మృదుపాదపద్మంబు ♦ లంటినంత
దురిత తతులు దుఃఖంబులు ♦ దొలఁగిపోవ
రాహుపీడా వినిర్ముక్త ♦ రాజబింబ
సదృశులై చెలువొందిరా ♦ జనములవని॥

నమ్మియుండిన జనులక ♦ నవరతంబు
శంఖ చక్రగదాఖడ్గ ♦ సహితుఁడగుచు
దివ్య దర్శనమొసఁగి సం ♦ తృప్తినొంద
జేయుచుండును దనవింత ♦ చేష్టితములఁ॥

సౌమ్యమతి భగవానుదా ♦ సనెడుభక్త
వరుఁడు బొంబాయి నగరని ♦ వాసుఁడుండె
కూర్మి తో దర్శనంబిడి ♦ కోరుకీతి
వలయు నుపకృతులతనికి ♦ సలుపుచుండు॥

అతనిసతి గర్భవతియయ్యె ♦ నంత ప్రసవ
సమయమరుదేర హారుడబ్ర ♦ సన్నమతిని
సూతికా గృహమందునా ♦ సుదతికప్పు
డువిదరూపము ధరియించి ♦ యుపచరించె॥

ఆమెయెవ్వరో తెలియఁగా ♦ నాత్మనెంచి
యూరుపేరులనడుగ న ♦ య్యువిదనగుచు
బాలనేదెల్పనేలని ♦ భర్తనడిగి
తెలిసికొమ్ము పొమ్మంచుదా ♦ బలికె హారుఁడు॥

అంత విమ లాంబతనభర్త ♦ చెంతకరిగి
నాకుసేవలొనర్చెదు ♦ నాతియెవరు!
హారుని ముఖచిహ్నములుగల ♦ వామెవదన
కమలమందన నాశ్చర్య ♦ కలితుఁడగుచు॥

ప్రాణనాయకీ! నీకాత్మ ♦ బంధువనుచు
దలచి యుంటెనిన్నాళ్లు నా ♦ తరుణినిను చు
విమలతో భగవానుడా ♦ రమణికడకు
మరల చనుదెంచునంతలో ♦ మాయమాయె॥

"జాల్నిగుడ" యనుపురమున ♦ సాధ్వియొకతె
పూజ గావించి వెన్నను ♦ పొల్పుమీర
హారునకు నివేదనంబిడ ♦ నందుసగము
ధ్యానసిష్ఠలోనుండిన ♦ తరుణమందు॥

బాలకృష్ణరూపంబున ♦ ప్రాకికొనుచు
వచ్చివెన్ననుదిని సుమ ♦ గుచ్ఛములను
జిమ్మివైచుచు దనబాల్య ♦ చేష్టితముల
నమరజూపుచు నామెకా ♦ హ్లాదమొసఁగె॥

పరమ సాధ్వికామేశ్వరీ ♦ బాయియనగ
రమ్యగుణుడామెపతియునా ♦ రాయణుడన
బరగు నీపిశాలురు బరం ♦ పురమునం జె
లంగుచుండిరి ప్రేమాంత ♦ రంగులగుచు.

నొప్పుమీర సతీపతు * లొక్కతరిని
హరునిదర్శించి వేడస * మాదరమున
" కోరినవరంబులిత్తున * వ్వారిగాగ "
ననగహర్షించి దమపురి * కరిగిరటుల॥

కొంతకాలముగడచె ని * శ్చింతతోడ
కర్మవశమున రుగ్మత * గలిగెసతికి
నంతవైద్యరత్నములు ఘ * నౌషధముల
నొసంగి రోగశాంతికి, మది * విసువుజెంది॥

కలండు దేవేంద్రనాథను * ఖర్జియనెడు
వైద్యశేఖరుండొక్కడు * వానికడను
జనము మేమౌషధమునీయ * జాలమనుచు
రహి మొసంగగబలుకనా * రాయణుండు॥

సతినిగొంపోవ డాక్టరా * సతిసగాంచి
నేటినుండి యారోగ్యంబు * నీకుగల్గు
గానహరుని భజింపుని * ష్కలుషమతిని
ననియె కామేశ్వరింగాంచి * హర్షమందె॥

సాటిలేని సద్భక్తితో ♦ నాటినుండి
హరుని స్మరియింపగా నృసిం ♦ హాకృతిగను
మానవకృతిగను బుధ ♦ మాన్యుండగుచు
స్వప్నముదా సకియకు ద ♦ ర్శనమొసంగె॥

నిద్రమేల్కాంచి సంతనా - నీరజాక్షి
స్వప్నవృత్తాంతముం జెల్ప - సంతసమున
సంతనారోగ్య వతియయ్యె - హారుమపిదప
సేమమూరయ నటకువి - చ్చేసెగృపను॥

హరుండెటకు బోవనటబర - మాద్భుతముగ
జాతిమతభేదముల విప - క్షతదలంపక
వైభవోన్నతిగృహదాన - వస్త్రదాన
మన్నదానముల్ జేయుచున - హర్నిశముల॥

మహితలావణ్య రమకును - మాలలాను
సంతతానంద సాంద్రమై - జనులకెపుడు
దధిపయః ఫలాగులను ము - దముననొసంగు
చుండుటను గాంచగామది - చోద్యమొదవు॥

సొంపుగా భక్తకోటికి ♦ జూపినట్టి
పలు విధములగు మహిమలు ♦ గలవటంచు
వింటి కనులార నీమూపు ♦ గంటిముక్తి
పథము గనుగొంటి నీదివ్య ♦ పదములంటి.

గరిమతోడ శ్రీ రాధాన ♦ గరములోన
మీ పదసరోరుహ శ్రీస ♦ మీపమునను
నిలచి మీ దివ్యమంగళ ♦ స్నిగ్ధమూర్తి
కనుల పండువుగా గంటి ♦ గాదె? జేన!

ఆకు లలములు భక్షించి ♦ యడవులందు
సంచరించుచు దమపూర్వ ♦ సంచితముల
వలన గలుగు ఫలముల న ♦ హారితముగ
ననుభవించినారెట్టి మ ♦ హాత్ములైన.

ఆలుబిడ్డల దమబాంధ - వాళినంతి
పురములనువీడి భిక్షాన్న - భక్తులగుచు
బాములసహించి ఘోరత - పములొనర్చి
నిన్నుగనలేక తిరిగి జ - నించిరిలను॥

శిల్పినీహస్త ంతురీ - కల్పితమగు
మహితక శమయమగురమ్య - మందిరమున
బ్రాజ్ఞులెల్లరు నీదుమ - నోజ్ఞమూర్తి
ధ్యానమొనరించి తన్మయ - త్వంబునొంది॥

సొంపుమీరఁగ భావప్ర - సూనములను
నిన్నుబూజనమొనరించు - చున్న వేళ
శాంతమూర్తి యా నిన్నునా - స్వాంతమలర
గాంచినేధన్యనైతిని - గాదెతండ్రి॥

పరమపావనులైభక్త - వరులునీదు
పాదధూళినిశిరమున - సాదరముగ
దాల్చిధ్యాన నిమగ్నులౌ - తరినిఁజూడఁ
నేత్రపర్వమై జెలఁగె వి - నిర్మలాత్మ॥

సారసాక్షి శ్రీహారుగొల్వ - జాలమేల
రండురండని తోడివా - రలనుబిలచి
కాలహారణమొనర్చుట - మేలుగాదు
పయనమందలసి వచ్చెను - ప్రభువటంచు॥

శ్రీకుసుమహారుపాదాభి - షేకమునకు
లలితజలపూర్ణమణిమయ - కలశములను
రత్నవిరచితకంకణ - రవముచెవ్రుల
కింపొనర్పంగదెచ్చిర - య్యిందుముఖులు।

కరచరణములబన్నిట - గడుగుభామ
అడుగుదమ్ముల వలువచే - నద్దులేమ
సింహాపీఠకనాసీను - జేయు నువిద
అందమగు మేనగంధము - లందుముగుద॥

ఇంపుగాం గప్పురపువిడె ♦ మిడెనువనిత
వేడ్క వింజామరనుదెచ్చి ♦ విసరు గరిత
దివ్యఫలముల భక్తి నం ♦ దించుచాన
పుష్పమాలిక మెడనుంచి ♦ పోవు లలన—

మించు ప్రేమమునను బల్కం ♦ రించు వెలది
పలుకనేరక ముగ్ధయై ♦ నిలచు పొలతి
కన్నులారగ ప్రభుమూర్తి ♦ గాంచు చెలియ
కూరిమిని బాదములచెంత ♦ జేరు సకియ—

దేవ! తావక సుకుమార ♦ దేహమిటుల
కాంతిదక్కి యుండుట కేమి ♦ కారణంబొ?
అలసితివె? నీదు పయనంబు ♦ నందు సాధు
వర్య! నే జేయునట్టి స ♦ పర్య గొనుము!

అనుచు సద్భక్తబృందంబు ♦ హరుని చరణ
సేవ లొనరింప వారి నా ♦ శీర్వదించి
శీతలములగు చూపుల ♦ చేత వారి
నాదరించిన దృశ్యమే ♦ నాత్మఁ దలఁతు.

శ్యామసుందర! నినువేడ ♦ సదయుడవయి
అస్మదీయాంతరంగాల ♦ యంబునందు
సొగసుగుల్కురూపునఁ బొడ ♦ సూపునపుడు
భావ మానందభరితమై ♦ ప్రబలుగాదె?

తావకీనమనోజ్ఞమౌ ♦ దరహాసమ్ము
దలప నానంత బాష్పంబు ♦ లొలుకు హరిని
నిన్ను వర్ణింపగావలె ♦ నన్న వాంఛ
ఘాఢమినంతనె నామేను ♦ పులకరించు.

మానసంబను రమణీయ ♦ మందిరమున
నిండు వేడ్కతోఁ బూజించు ♦ చుండనాదు
స్వాగతంబాది వసియించు ♦ సమయమందు
నీదు పాదపద్మములు స ♦ న్నిధికి జేరె॥

ఇహపరంబులగోరకే ♦ నహరహంబు
ప్రవిమలాత్మ! నీ భాసుర ♦ పాదయుగళి
హృదయమున నిల్పి జన్మరా ♦ హిత్యపదవి
బొంద నెమ్మది నుత్సాహ ♦ మొందుచుందు.

శిరము వ్రాల్చి నమ్రతను వీ * క్షించియుంటి
గాని ప్రియహార నీ మూర్తి * గాంచనైతి
మామక మనశ్శ్రోత్రమ్ము * మనసుదీర
ద్రావనైతినీ మృదువాక్సు * ధాసరమ్ము

నిన్నుగన్గొనిముగ్ధనై * నిల్చియుంటి
గాని నిన్బల్కరింపగా * జాలనైతి
ఎన్నియో దెల్పవలెనని * యోచియుంటి.
గానిమదిని సంకోచంబు * మాననైతి.

రాగలోలుర చెంతకు * రాని ప్రేమ
భోగశీలుర దరిజేర * బోని ప్రేమ
రాజయోగుల మదిసదా * గ్రాలుప్రేమ
అట్టి ప్రేమాబ్ధి మున్గి నే * నవశనైతి.

అంతరంగంబు నిండి తొ * ల్కాడుప్రేమ
ఆత్మవిభుతోడ నైక్యమై * యలరుప్రేమ
విమలవిజ్ఞానమూర్తియై * వెలయు ప్రేమ
అట్టి ప్రేమాబ్ధిమున్గి నే * నవశనైతి.

అనుప మానమై వెలయు శ్రీ ♦ మూర్తిమున్గ
వీడి చనలేక వెనుకంజ ♦ వేయుతఱిని
సౌమ్యగతినొప్పు నీ కడ ♦ సోఁచుచూపు
దలచినంతనె మది విషా ♦ దంబువోడము.

లోక కల్యాణమునకై య ♦ నేకరీతి
వేసముల వేయుచుండు ట్రి ♦ యాస లేక
కాన నీ దేహమునువీడ ♦ గాఁ దలంచి
యుంటివనని వచించెను సమ ♦ యోచితముగ.

సకలమీ సృష్టిని విధివ ♦ శమ్మగాన
ఖేదపడకుడు నాకొర ♦ కింకమీర
లనెడు మీయంత్య సందేశ ♦ మాత్మదలప
హృదయ ఖేద్యమానుగదయ్య ♦ సదయహృదయ!

ప్రకృతి కాంతాలలామతో ♦ పవలు రేయు
చోద్యగతి నాటలనునాడు ♦ చుండుగాన
ప్రకృతి సూక్ష్మరహస్యమా ♦ ప్రభు డెరుంగు
గాని యితరులకా భాగ్య ♦ గరిమ గలదె?

వరుస నరువదిరెండు సం ♦ వత్సరములు
గడపె పూవును దావియు ♦ గలసియుండు
లీల కుసుమాంబతో జగ ♦ త్పాలకుండు
రమ్యగుణసాంద్రుడైన మనో ♦ రంజకముగ.

సకలసుగుణాశ్రయుండని ♦ సాధు తతులు
సుకవులు బొగడ పండిత ♦ నికర మలర
అర్థి లోక నిర్జరతరు ♦ వగచు శ్రీమ
ద్రాజ్యమేలెను రాజమూ ♦ ర్ధన్యుడగుచు.

లీలలను భువిలోన జా * లింతుననుచు
అఖిల భక్త సంఘములు దుః * ఖాబ్ధి మున్గ
చిత్రగతిని నతండు వ * చించినటుల
నా తరుణమ్మందె హరుఁడు ని * ర్యాణమందె.

ఆగమాంతోక్తులకు నైన నందరాక
నెమ్మి సర్వ ధరావల * యమ్ము నందు
నిండి వెల్గొందుచుండు * ఖండితాత్మ
ననఘు వర్ణింప భువిని నా * కలవి యగునె.

ఐన నాయుపదేశ వాక్యాళి నాదు
మానసక్షేత్రమందు స * మంచితముగ
నాటియుండె నాతని గన్న * నాటినుండి
చిత్త మేకాగ్రతం గని * చెదరకుండె.

కూర్మి హరలీల వచియింప * గోర్కె వొడమ
నంత భారతీసతి కుతూ * హలముతోడ
నతని కృపచే మదాత్మయం * దలరి పలుక
బలికియుంటి: స్వబుద్ధి నే * బలుకఁగలనె?

## —* భరతవాక్యము. *—

కలుగుఁగాక! దీర్ఘాయుస్సు ♦ కలుగుఁగాక!
కలిత సౌఖ్య మారోగ్యంబుఁ ♦ గలుగుఁగాక!
కలుగుఁగాక! శుభంబులు ♦ గలుగుఁగాక!
కలుగుఁగావుత! తఱుగని ♦ కలుము లవని !

శా॥ అంబాదివ్యపదారవిందభజనా * నందైకరాజ్యాధికా
రంబూనంగల నందిగాడ వర సు * బ్రహ్మాణ్యపత్న్యంక శే
షాంబాస్మత్కృతి రత్నమానిదిధర * ణ్యాచన్ద్రతారార్కభా
షంబై యొప్పఁగఁజేయుమయ్య! కుసుమే * శా! హే ప్రభూ!
[ శ్రీ హారా !

